Sl NO. 1

19 JUL. 94 MADRAS.

శ్రీసద్గురు...

అచలగురుపరంపరద్వి...

# ...చలగురుగీతాశతకము.

ఇది,

సరస్వతి-భోజరాజుచే రచియింపంబడి

పోకల - వేంకట-నరసింహారావునాయనిచే

సవరింపంబడి.

వె. నా. జూస్లి ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రచురింపంబడియె.

రిజిస్టరు కాపీరైట్టు.

1894 సం॥

*Registered Copy Right.*

**Price 1. Anna.** **దీనివెల 1. అణా.**

# ప్రకటన.

| వేదాంతగ్రంథముల వివరము. | వెలలు రు. | అ. | పోస్టేజి అ. | పై. |
|---|---|---|---|---|
| సుజ్ఞానదీపమను గురుగీత ౨౭౪ శ్లోకములు. | ౧ | ౮ | ౧ | ౦ |
| శ్రీశివరామదీక్షితీయమను అచలగ్రంథము ... | ౧ | ౦ | ౧ | ౦ |
| శుద్ధనిర్గుణ కందార్థదరువులు తాత్పర్యంసహా | ౦ | ౧౨ | ౧ | ౦ |
| శ్రీకృష్ణబోధామృతమను, ౧౨ రాజులకథలు. | ౦ | ౧౨ | ౧ | ౦ |
| శ్రీకృష్ణోద్ధవ సంవాదమను పరమపదమార్గము. | ౦ | ౮ | ౦ | ౬ |
| శ్రీరామహృదయమను యింద్రజాలపు కథలు. | ౦ | ౮ | ౧ | ౦ |
| వసిష్ఠజనక సంవాదము, అతీతమార్గ గ్రంథము, | ౦ | ౮ | ౧ | ౦ |
| శుకపంచవింశతియను ౨౫-కథలు ... | ౦ | ౮ | ౧ | ౦ |
| సుజ్ఞానరత్నావళి, ౧౦౮ వేదాంత కీర్తనలు | ౦ | ౬ | ౦ | ౬ |
| భక్తవిజయమను ౧౦ మహాపతివ్రత కథలు. | ౦ | ౬ | ౦ | ౬ |
| ఉషాపరిణయము, వచనకావ్యము ... | ౦ | ౬ | ౧ | ౦ |
| శ్రీకృష్ణనృగుమహారాజు సంవాదంబను ... | ౦ | ౪ | ౦ | ౬ |
| యోగానందచరిత్ర, యక్షగానము ... | ౦ | ౪ | ౦ | ౬ |
| ఆత్మవిలక్షణసారమను గ్రంథము ... | ౦ | ౨ | ౦ | ౬ |
| ఆంధ్రపంచీకరణము ... ... | ౦ | ౨ | ౦ | ౬ |
| అద్వైతరహస్యము ... ... | ౦ | ౨ | ౦ | ౬ |

ఈ గ్రంథములు చెన్నపురి, నాటుపిళ్లారి గుడివీధి కవాట సంఖ్య (౨౦) గల మందిరంబున విక్రయింపంబడును.



ప్రియశిష్యుఁడు.

సరస్వతి - భోజరాజు.



అచల సద్గురుఁడు.

పోకల - శేషాచలమునాయఁడు.



శ్రీశేషాచలసద్గురువేనమః

# అచలగురుపరంపర

## ద్విపద.

శ్రీసచ్చిదానంద * చిన్మయాతీత । వాసవాద్య
మరసు *వందితచరిత । అగణితనిర్గుణ * అచలసం
పూర్ణ । నిగమాదిసంస్తుత*నిర్మలాకార । కళనాద
బిందుసం*కలితాదిరహిత । చలితమాయావిద్య *
జననాదిశూన్య । అచలబోధార్యుల * నాత్మనుద
లంచి । ప్రచురింతు సతతంబు * భక్తితోడుతను ।

వలనొప్పద్విపదఁగా * వర్ణనజేతు । సలలితవేదాం
త * సారులౌఘనుల । పరిపూర్ణనిర్గుణ * బ్రహ్మం
బునందు । పరమశివుండన * బరగెనతనికి । బ్రహ్మ
యుశిష్యుఁడై * ప్రబలెనాతనికి । బ్రహ్మస్వరూపుఁ
డై * బరగుచున్నట్టి । శ్రీవసిష్ఠగురుండు * సేవకుం
డయ్యె। పావనజనకుండు * భక్తుఁడై వెలసె । వారి
కిశిష్యుండు * వరశుకబ్రహ్మ । కూరిమి సాందీప
గురువరేణ్యుండు । శిష్యతిలకుఁడైన * శ్రీకృష్ణమూ
ర్తి। శిష్యుఁడాయుద్ధవ* శేఖరుండనఁగ । మహనీయ
యుద్ధవ* మాయదూరునకు । మహినిబ్రహ్మానంద*
మహనీయులంద్రు । రామావధూతన * రాజిల్లుచు
న్న । ప్రేమకఫీర్దాసు * ప్రియశిష్యుఁడయ్యె । అత
నికిశిష్యుఁడై * యలరెవేమన్న । సతతమచలమం
దు * సంపూర్ణుఁడాయె । సిరిమీఆనతనికి * శ్రీధర

స్వామి । పరగశిష్యుండునై * పరిపూర్ణుం డయ్యె।
నట్టి శ్రీధరులచే * నచలభావంబు । నెట్టన గ్రహి
యించి * నిర్గుణసగుణ । రహితుండౌ శ్రీశివ * రా
మదీక్షితులు । బహురీతులనచల * భావంబు వ్రా
సె । అలరామకృష్ణయ* యనుమహాత్మునకు । నెల
మిమహేశ్వరుం* డిలశిష్యుండయ్యె । పరగకోటప్ప
దే * వర మహేశ్వరుని । కిరవంద ఛాత్రుండై *
యొుకబోందోంలె । నతనికంతేవాసి*యైచెన్నపు
రిని । నతిభక్తినతనిచే * నచలభావంబు । వడిసె
శేషాచల * వరగురుండతండు । వరషోడశాక్షరి *
వదలితానెందు । నచలుండై తనదుశి*ష్యావళికెల్ల।
స: :చరంబు ల* సత్యంబులంచు। బోధించుచుం
డెను * బూర్ణమైనట్టి । బోధదొడ్డదియంచుం *
బూజించియతని । పదపద్మములకును* బహునతు

లిడియు । సదమలవేదాంత * సరణినేగంటి । ఆ
సరస్వతివంశ* మందుద్భవించి । వాసియాదవగిరి*
వాసుండనైన । భోజరాజాఖ్యను * భోగ్యంబుగా
ను । రాజితయచలంబు * రయమున నేను । బోధఁ
జేయుదుపుణ్య * పురుషార్థమవల । సాధనరహిత
మా * సత్యాచలంబు । అనియిట్లుప్రార్థింప *
నతిదయాపరుఁడు । వినుమనియచలంబు * వివరిం
పఁదొడగె । నీజగత్తునుమిథ్య * నిజమచలంబు ।
రాజిల్లుచున్నది * రయమునజూడు । బట్టబయలై
నట్టి * బ్రహ్మంబునిదియు । పట్టుగాద్వాదశి * ప
లుకఁ-యిట్లనుచు । ఈగుర్తుదెలిసెడి * ఈశరీరంబు।
బాగుగాలేదని * పరికింపవలయు । నిదియె శ్రుతశి
మంత్ర * మిదిదబ్బరనుచు । విదిత యోగాతీత *
వేదాంతసరణి । వివరింపతన్మయ * వివశుఁడై య

పుడు। అవిరళంబై నట్టి * యచలంబుగనెను । ఇది రాజమార్గంబు * ఇదియెగోప్యంబు । ఇది యనాయాసంబు * ఇదియచలంబు । ఇంతకంటెనుబోధ* ఇలను లేదనుచు । సంతసంబున బోధ * జలధిలో గ్రుంకి । పలికించువారును* పలుకువారెవరో । పలుకువిన్నదియును * భావంబుమఱచి । యచల సంపూర్ణుండై * యవనిచెన్నొంది । ప్రచురించి నాఁడను * పరగనీయట్టి । గురుపరంపరయును * కోర్కె దీపింప। పఠింపభక్తిచే*పఠియింతురేని । ఆయురారోగ్యముల్ * ఐశ్వర్యములను । బాయక గురుమూర్తి * భక్తులకిచ్చు॥





శ్రీసద్గురవేనమః.



# అచలగురుగీతా
# శతకము.

శ్రీసదానందపరబయల్ * చేరుకొఱకు । నార్య
చరణసరోజంబు * లాత్మఁదలఁచి । సకలవేదాంత
సారంబు* సంగ్రహించి । యచలగురుగీతరచియింతు * నానసంగ । నసిప దాంతర్య శేషాచ * లా
ర్యవర్య ॥ ౧॥

వందితాచార్యసచ్చిదా * నందరహిత । వంది

తాచార్య శ్రుతిమహా * వాగతీత । వందితాచా
ర్యయశరీర * ద్వంద్వరహిత ॥ అసిప ॥ ౨॥

హరిహరబ్రహ్మాదేవేంద్ర * నరసురాది । పన్న
గాసురగంధర్వ * ప్రముఖులెల్ల । ను నగురోరధిక
మనుచు * ఘనతఁబొగడు ॥ అసిప ॥ ౩॥

అచలగురుమూర్తిపాదంబు * లాత్మయందు ।
గుత్తినిడియుగీతశతకపూ * గుచ్ఛములను । మాన
సంబునఁబూజింతు * మరువకెపుడు॥అసిప॥ ౪॥

సంస్కృతాంధ్రంబుఛందస్సు * చదువలేదు।
పంచకావ్యాద్యమరముల * పఠనలేదు । పల్కు
వల్కించుగురుకృపఁ * బల్కినాఁడ॥అసిప॥ ౫॥

తప్పులేకుండఁజెప్పనా * తరముగాదు । తప్పుగ
లచోటదిద్దుడు * తత్వవిదులు । తప్పులేకున్న దిద్ద
గాఁ * దగదుసూవె ॥ అసిప ॥ ౬॥

నమ్మరాదుగాయీదేహ * నటనలనుచు । పర
మగురుఁజేరిమోక్షంబుఁ * బడయవలయు । నెప్పు
డోహంసక్షణములో * నెగిరిపోవు॥అసిప॥ ౭॥

ఎఱుకబోధించుగురువుల * నెన్నఁదరమె । య
చలబోధార్యు లుర్విలో * నరుదుసూవె । యట్టి
గురుపాదపద్మముల్ * పట్టవలయు॥అసిప॥ ౮॥

అచలగురుసేవద్వాదశ * హాయనములు । నా
ల్గువిధములశుశ్రూష * నడుపునట్టి । సాధనచతు
ష్టుఁడధికారి * ఛాత్రుఁడనఁగ॥అసిప॥ ౯॥

అచలపరిపూర్ణభావంబు * నరయభువిని । దే
వతలకైనగురులేక * దెలియఁదరమె । బయలుగు
రురూపధారియై * బల్కుచున్న॥అసిప॥ ౧౦॥

వేదముల్నాల్గుశాస్త్రముల్ * వెలయనారు ।
పదునెనిమిదిపురాణముల్ * భవ్యకథలు । చదువఁ

గానేల గురువాక్య*సమముగావు॥అసిప॥ ౧౧॥

యఫయెబియెబియల్ యెల్ యెల్ డి * యంయె
ప్యాసు । లెన్నిజేసినసైనను * నేమిఫలము । సం
స్కృతాంధ్రాదిభాషలఁ * జదువుకొన్న । పరమ
గురుపాదధూళికి * సరియుగావు॥అసిప॥ ౧౨॥

వేదములన్నదివిలాజ్ఞాన * వేద్యుఁడగుచుఁ । బ
రగగురుబోధలేనట్టి * పామరుండు । నడవిఁగాసిన
వెన్నెలై * నట్టివిధము ॥అసిప॥ ౧౩॥

శివునికోపంబుమాన్పను * శ్రీగురుండు । గురు
షఁగోపింప రక్షింపఁ * బరులులేరు ; గానగురుకం
టెశ్రేష్ఠంబు * గలదెభువిని॥అసిప॥ ౧౪॥

గురుఁడనీకృపగలతత్వ* కోవిదులకు । విరతిచే
నున్నసంసార * వితతినున్నఁ । జదువురాకున్న జది
విన * సమమెము క్షి॥అసిప॥ ౧౫॥

అచలభావంబు దెలిసిన * యార్యవరుల । భక్తి
సేవించిమోక్షంబుఁ * బడయవలయు। శిష్యవిత్తా
పహారులఁ* జేరవలదు॥అసిప॥ ౧౬॥

సూచకనిషిద్ధబోధక * వాచకాది । గురులు
వేనమంద్రుగలరుసూ * ధరణిలోన । నచలగురుడం
దరికినన్న * నధికుడరయ॥అసిప॥ ౧౭॥

దేవతార్చన జపహోమ * తీర్థయాత్ర ।
దానధర్మాదిక్రతుముఖ్య * తపముఁజేయు । పుణ్య
ములకంటె గురుఁజేర * పూర్ణఫలము॥అసిప॥౧౮॥

గురుఁడుశిష్యాధికారంబు * గుఱుతెఱింగి । బో
ధకునిజేయ శిష్యుండు * పూర్ణుఁడగుచు । భ్రమర
కీటకన్యాయమై * పరిణమించు॥అసిప॥ ౧౯॥

దారునిర్మితమాచిత్ర* దంతిఁజూచి । గజముక
ల్పితమనిదారు * గన్నరీతి । దేశికేంద్రులకృపబ

యల్ * దెలియవలయు॥అసిప॥ ౨౦॥

పిల్లలెల్లఋను హంళక్కి * పేర్ల చేత । రాజుమం
త్రియుభటవర్గ* రాజ్యమనుచుఁ । గ్రీడచేనాడు కా
లంబు * క్రియనువెలయు ॥అసిప॥ ౨౧॥

తామ్రమమృణ్మయదారువు* తత్ప్రతిమలఁ ।బూ
జసేయంగముక్తిని * బొందుటెట్లు । అల్పమతుల
కుదైవంబు * లనఁగవలయు॥అసిప॥ ౨౨॥

దశమియేకాదశియనువ్ర* తములఁజేయ । మొ
దుకుదినకున్న దుర్గుణ * మేలమాను । పుట్టపైగొ
ట్టనురగంబు * గిట్టుటెట్లు॥అసిప॥ ౨౩॥

మధ్వమతజీవశివభేద * మణఁచలేరు । కర్మగు
రుచేతముద్రలఁ*గాల్పఁబడిన । బాప ముక్తులమం
దురు * పశువులరయ॥అసిప॥ ౨౪॥

స్మార్తకర్మంబుయజ్ఞాది * సమయమందుఁ। బ్రా

ణమునుహింససేయంగ * ఫలముగలదె । యాత్మ
వత్సర్వభూతాని * యనఁగవినమె॥ అనిప॥ ౨౫॥

భూతిదేహంబునకుఁబూయఁ * బూసగదిలను ।
రాతిలింగంబుగట్టుట * రీతియగునె । యిట్టిపాషం
డులకుముక్తి * యెట్లుగలుగు॥ అనిప॥ ౨౬॥

తాటియాకులవ్రాసిన * తత్వములను । జదువు
కొన్నంతమాత్రాన * జక్కఁబడదు । గురుకృపన
నుభవములేకఁ * గుదురఁగలదె॥ అనిప॥ ౨౭॥

బ్రహ్మవిద్యకుతలిదండ్రి * భార్యసుతులు । వశు
లయినసంసారంబు * వదలనేల । వశముగాకున్న
వారల * వదలమేలు॥ అనిప॥ ౨౮॥

బురదనంటనికమ్మర * పురుగుమాడ్కి । య
బ్జపత్రంబు నకునంబు * వంటనట్లు । లాత్మవేత్తకు
సంసార * మంటకుండు॥ అనిప॥ ౨౯॥

యోగములచేతకష్టించి * వేగనేల । లక్ష్యము
ద్రాదిసాధన * ల్బలుపనేల । సులభమౌముక్తి గు
రుసేవ * సలిపినపుడె॥ అసిప॥ ౩౦॥

జీవశివులకుభేదంబు * సెప్పరాదు । పరగక్షీరో
దకన్యాయ * పాటిదనరు । సోహమనిబల్కు వేదం
బు * సుస్థిరముగ॥ అసిప॥ ౩౧॥

భావనాతీతనిర్గుణ * బ్రహ్మమందుఁ । గల్పితా
విశ్వజీవసం * కల్పమెల్ల । స్థాణుచోరాది న్యాయ
మై * దనరుచుండు॥ అసిప॥ ౩౨॥

హఠముసాధించియణిమాది * యష్టసిద్ధి । తన
కుఁబ్రాప్తింపఁబరులకుఁ * దగనుజూపి । మోహి
తైయెదుదమనుజుండు * మోసపోవు॥ అసిప॥ ౩౩॥

కొండగృహలందు నడవిలో * కోతిరీతి । ఫల
ములనుదినిశీతోష్ణ * ములకునోర్చి । తనువుదండిం

పమోక్షంబు * గనుటయెట్లు॥ అసిప॥ 3౪॥

జడలుగడ్డంబుగోళ్లను * జాలపెంచి । బుట్టగో
చియు జపమాల * బూనినంత । కపట సన్న్యాసు
లైనను * గలదెముక్తి॥ అసిప॥ 3౫॥

ఖండశర్కరయనివ్రాత * కాగితమును । నాకి
నంతనెమధురంబు * నందరాదు । ననుభవములేక
బ్రహ్మమే * ననుటయెట్లు॥ అసిప॥ 3౬॥

మూడునాడులలోపల * ముఖ్యమైన । నాడికా
గ్రంబుననుజేరి * నాతిగూడి । పరగ సుఖయించు
నాతండు * భవ్యయోగి॥ అసిప॥ 3౭॥

బ్రహ్మసంపూర్ణభావంబు * ప్రబలుయోగి । వి
రతుఁడై నడవినినున్న * పేటనున్న । నిరుపురకుమో
క్షమొకటే * యెంచిచూడ॥ అసిప॥ 3౮॥

బ్రహ్మచింతననిరతంబు * బరగుయోగి । విష

యసంసారి గానుండి * వేరెయగుచుఁ । బంకమ్ము
త్రికటకల్మషం * బంటనట్లు॥ అసిప॥ ౩౯॥

కన్యప్రాయంపుచిన్నది * కళలదేరి । పండువె
న్నెలబయలులోఁ * బాటపాడు । ప్రభువు గురురా
యుఁడాపెను * బరిణమించు॥ అసిప॥ ౪౦॥

పరుసవేదియునినుమును * పరగసోకి । నినుము
నపరంజియై కాంతి * నిచ్చునట్లు । గురునిగనుగొన్న
శిష్యుండు * గురుఁడుగాఁడె॥ అసిప॥ ౪౧॥

చంద్రసూర్యాగ్నితారక * సాంద్రభాతి । గం
గయమునసరస్వతి * సంగమమున । వేయుదళప
ద్మచివరదా * వెలయుయోగి॥ అసిప॥ ౪౨॥

బూదిగప్పినసిప్పును * బోలియోగి । బ్రహ్మమై
యుండిజగమున * బయలుపడక । శిష్యులకు తప్ప
నొరులకుఁ * జిక్కకుండు॥ అసిప॥ ౪౩॥

త్వంపదంబనజీవుండు * దనరుచుండు । తత్ప దంబనశివుఁడని * దలచవలయు । అసిపదంబనరెం టికి * నైక్యమరయు॥ అసిప॥ ౪౪॥

కాయపంజర ఖంశుకీ * గానగీత । బలుకుచుం డునుప్రణవంబు * పాటమీాఱి । బలుకు నిశ్శబ్దమా పర * బ్రహ్మమనగ॥ అసిప॥ ౪౫॥

రాజయోగిసదావి * రాగుడగుచు । పూర్ణకుం భకనయనాగ్ర * పుష్పమందు । తన్మయానందబ యలులో * దనరుయోగి॥ అసిప॥ ౪౬॥

యోగియైననుసంతత * భోగియైన । త్యాగియై నను వనోవి * రాగియైన । బ్రహ్మచింతనజేయం గ * బడయుముక్తి॥ అసిప॥ ౪౭॥

రామచంద్రుండువిష్ణుఁడై * రాజనను చు । గుం తినుతకర్ణుఁడునుసూత * కులజుఁడనుచు । సంశయ

భ్రాంతిగురుచేత * నమసినట్లు॥ అసిప॥ ౪౮॥

ప్రాకృతంపై నపడుగురు * పరగఁగూడి । తో
లుతతన్విడ్చిలెక్కించప * తొమ్మిదనుచు । దుఃఖపడ
వెన్కగురుచేతఁ * దొలఁగెభ్రాంతి॥ అసివ॥ ౪౯॥

భక్తివైరాగ్యజ్ఞానంబు * బరగమూడు । ము
క్తిసోపానపఙ్క్తిచే * మోడమలర । మేరు శిఖరాం
తరస్థలి * మెలగుజ్ఞాని॥ అసిప॥ ౫౦॥

ముగ్గురు మూర్తులు శక్తియు * ముక్తికాదు ।
స్త్రీనపుంసకపురుషాది * తెగలుగాదు । సృష్టిస్థితి
లయకార్య * సమష్టికాదు॥ అసిప॥ ౫౧॥

భిక్షుకుఁడొకండుకలగని * బీరుభ్రాంతి । దనకు
రాజ్యాధిపత్యంబు * దనరినట్లు । మేల్కనియు జూ
డలేదాయె * మిధ్యజగము॥ అసిప॥ ౫౨॥

తివిరిదేహాభిమానంబు * దెగినయపుడు । మా
నసముతోడనామాయ * మాయమాయె । నం
దునేమాయెసంపూర్ణ*యచలమాయె॥అసిప॥ ౫౩॥

పవనధారణలక్ష్యముల్ * పరగసాంఖ్య । తార
కామనస్కాదిసా * ధకులకెల్ల । నచలభావంబు
దెలియుట * యరుదుసూవె॥అసిప॥ ౫౪॥
వశముజేసుకవాయువుల్ * వసుధపైన । నం
తరిక్షంబునమనిల్వ*నధికమేమి । పక్షులాడవెయం
తర*పథమునందు॥అసిప॥ ౫౫॥
యోగసాధనలెందుకు * యొడలునొవ్వ । ము
ద్రలక్ష్యంబులనుకండ్లు * మూయనేల । కదలకు
న్నట్టిబ్రహ్మంబు * గానలేక॥అసిప॥ ౫౬॥
యోగసాధనల్దొమ్మిది * యోగములను । తప
ములన్నిచీకురువాయి * తపములరయ । జపముస
లుపదెబకముదా * జలమునందు॥అసిప॥ ౫౭॥
సకలశాస్త్రంబులునుగాదు * చదువుగాదు ।
మంత్రతంత్రాదియోగముల్ * మహిమగాదు ।
యనుభవజ్ఞానవేద్యమై*యచలముందు॥అసిప॥౫౮॥
పండువెన్నెలకాంతిచే* బయలుసేరి । ౧యూలె

సంపూర్ణనిర్గుణ * బ్రహ్మమగుచు । బయలులోపల
నేకమై*బరగుగురుఁడు॥ అసిప॥ ౫౯॥

ఎఱుకమఱుపులరెంటిని * యెఱుఁగునట్టి । యె
ఱుకతోఁజేరియెఱిఁగిన*యెఱుకజనగ । శుద్ధమైనట్టి
యచలసం * సిద్ధిగలుగు॥అసిప॥ ౬౦॥

చూపులోఁజూపుఁజూడంగ * జూడఁబడదు । ప
లుకువలుకంగరానట్టి*బయలుకెపుడు । మ్రొక్కు
చుందురుజేజేలు * మోదమలర॥అసిప॥ ౬౧॥

పేరులేనట్టియాబట్ట * బయలునకును । యెఱు
కచేపేరుబయలని* యెఱుఁగబడియె । యేమికాదా
యెకానిదే * యచలమాయె॥అసిప॥ ౬౨॥

ఎఱుకచేతనుగురుశిష్య * లెన్నవలయు । యె
ఱుకతెరదీయగురుశిష్య* లెవరులేరు । జ్వాలకర్పూ
రన్యాయమై * చనుదలంప॥అసిప॥ ౬౩॥

ఉదకమునఁదడువదుగాలి * కులికిపడదు । చలి
కివణకదువహ్నిచే * నమసిపోదు । సర్వకాలంబు



యచలంబు*నమయకుండు॥అసిప॥ ౬౪॥

ఎఱుకమఱుపులరెంటిని*మెఱిఁగిపిదప। గురుని
శర్పించిమఱలగ్గై * కొనకనున్న । నట్టివారలెయశ
శీయ * లనఁగవలయు॥అసిప॥ ౬౫॥

సత్తుచిత్తునుయానంద*సమరసంబు। ననుభవం
బన్నిమెఱుకకే* యమరియుండు । ననుభవాగవ్య
సంపూర్ణ*యచలమగును॥అసిప॥ ౬౬॥

తెలియఁగాఁబోదు తెలిసిన* తెలివిగాదు । చూ
డఁబడరాదుచూచిన * ఙూపుగాదు । నిర్ణయోనా
స్తిసర్వదా * నెగడుశ్రుతులు॥అసిప॥ ౬ ॥

బయలుబ్రహ్మంబునిజమంచు * బల్కుశ్రుతులు।
గురుఁడుసూచింపశిష్యుండు* గోరినంతఁ । బేరులేన
ట్టిపరబయల్ * జేరుననఁగ॥అసిప॥ ౬౭॥

బయలెబ్రహ్మమానంతకు* పరములేదు । యా
ర్యప్రామాణ్యవాక్యంబు * లనుదినంబు । సత్యమ
నిభేదిసాటింతు* సర్వజగతి॥అసిప॥ ౬౮॥

భానుశశికోటికాంతులు * ప్రజ్వరిల్లె । పుష్ప
వర్షంబుచిత్కళల్ * పూర్ణమాయె । అన్నియు
నుబోయెతుదకుఁదా * నచలమాయె॥అసిప॥ ౭౦॥
సకలలోకంబులనునిండి* సత్యమగుచు । సర్వ
వస్తులములుగుచ్చ * సందులేక । యఖిలబ్రహ్మాం
డవ్యాప్తమై * యచలముండు॥అసిప॥ ౭౧॥
కత్తినిఁదెగదుయుక్తికిఁ* గట్టునడదు । పెలుగ
దెలుఁగదుకరఁగదు* తెలుగదెవుఁడు । యిట్టిదట్టిది
యనరాని * బట్టబయలు॥అసిప॥ ౭౨॥
కరతలామలకంబును * గన్నయట్లు । యంజన
ముచేత ద్రవ్యంబు*నరయురీతి । నార్యముఖరంబున
నచల * మరయవలయు॥అసిప॥ ౭౩॥
చూపువెలిచూపులోచూపు * చూడబోకు।
యాదిమధ్యాంతములులేక * నలరుబయలు । మె
పుడుఁజూచినప్రత్యక్ష * మెదుటనుండు॥అసిప ॥౭౪॥
బట్టబయలంచుకేవల*బ్రహ్మమనుచు । యచల

గురుబోధనిద్రించు * నంతవరకు । నాత్మయున్నం
తకాలంబు * ననఁగవలయు॥అసిప॥ ౭౫॥

పుట్టుకాలంబుపేరును*బెట్టలేదు । పెరిగినప్పుడు
తనకుఁదా*బేరులేదు । పుట్టుకయుఁబేరులేనట్టి*బట్ట
బయలు॥అసిప॥ ౭౬॥

ఎఱుకదైవంబయనుచుందు* రెల్లజనులు । నె
ఱుకదైవంబుగాదుగా*యెన్నటికిని । యెఱుకమా
యయనియచల*మెఱుఁగవలయు॥అసిప॥ ౭౭॥

బయలుకన్నను వేరొండు* బ్రహ్మలేదు । ద్వాద
శాక్షరిమంత్రంబు*దలఁచినయెడ । నీశరీరంబునకు
మూల*మేమిలేదు॥ అసిప॥ ౭౮॥

ఇట్టిమంత్రద్వయంబును*గట్టిగాను । పట్టుగాగు
రుగుట్టును * బడసెనేని । పుట్టఁబోడతఁడుపుడమిఁ*
గిట్టఁబోడు ॥అసిప॥ ౭౯ ॥

చూపుహూపునుసాక్షియై * చూచునొకటి । అ
న్నియునుగాకతన్నుఁదా* గన్నదొకటి । సర్వమును

సాక్షిగానట్టి * సహజమొకటి॥ అసిప॥ ౮౦॥
ఎందుఁజూచిననందెల్ల * సందులేక । పొందశ
క్యముగాకను * బూర్ణముగుచు । పలుకులకు నంద
రానిదే * బ్రహ్మమరయ॥ అసిప॥ ౮౧॥
బట్టబయలందుజగములు * పుట్టలేదు । యిం
ద్రజాలంబుపగిదిఁగా*నిలయుఁదోఁచు। భ్రాంతిమూ
లంబుజగమని * బల్కు శ్రుతులు॥ అసిప॥ ౮౨॥
శివుఁడు బ్రహ్మంబనుచుఁబల్క * సిగ్గుగాదె । వి
ష్ణు బ్రహ్మంబనుటయును * విస్మయంబు । బ్రహ్మ
బ్రహ్మంబనఁగవట్టి * భ్రాంతిగాక॥ అసిప॥ ౮౩॥
సంచితాగామిప్రారబ్ధ * సర్వకర్మ । లనుభవిం
చరీయశరీర * యచలఘనులు । కర్మవిరహిత పరి
శుద్ధ * ఘనులుగాన॥ అసిప॥ ౮౪॥
పుట్టుచావులులేనట్టి*పూర్ణమైన । యెఱుకమఱ
పులరెంటిని * నెగరఁగొట్టి । యనుభవాతీతుఁగాఁ
జేయు * నచలగురుఁడు॥ అసిప॥ ౮౫॥

గురులటన్నువారికి * గుర్తదేది । నల్లతెల్ల
నరక్తవ * ర్ణములులేవు । గుర్తువిరహితయశరీర*
గురులఁజేరు॥ అసిపు॥ ౮౬॥

పూసలునువేరుగూర్చిన * పోగునొకటి । అంగ
ములువేరునూకేవ*లాత్ముఁడొకఁడు। భ్రాంతిచేఁదోఁ
చుజగమెల్ల * బ్రహ్మమొకటి॥ అసిప॥ ౮౭॥

అనుభవముశ్రేష్ఠమనికొంద * ఱార్యులంద్రు ।
సత్యమైయున్నసుప్తిన * సత్యమవును । గారడపు
మాయబయలందుఁగానఁబడును॥అసిప॥ ౮౮॥

పంచభూతంబులునుగావు * ప్రకృతిగాదు । స
చ్చిదానందసమరస * సాక్షిగాదు । నాదబిందును
కళగాదు * నభముగాదు॥అసిప॥ ౮౯॥

కర్తకర్మయుభోక్తయు * కీర్తిగాదు । ఃనదుచే
యదుచూడదదు * విద్యగాదు । జపము తపమును
చైతన్య * జడముకాదు॥ అసిప॥ ౯౦॥

మూలప్రకృతికితల్లియు * మొదలులేదు । ప్ర

కృతిపురుషులకునుదంట్రి * బరగలేదు । ప్రకృతిపు
రుషరహితమని * బల్కు శ్రుతులు॥అసిప॥ ౯౧॥
అచలపరిపూర్ణులౌకేవ * లాత్మవిదులు । సకల
విష యేంద్రియంబుల * సత్యమనుచుఁ । బదియు
రెండక్షరంబుల* వదలరెపుడు॥అసిప॥ ౯౨॥
ఎఱుకయున్నంతకాలంబు * మఱుపునుండు ।
మఱుపుయున్నంతకాలంబు* నెఱుకయుండు । నట్టి
యీరెండువిడిచిన * నచలుఁడగును॥ అసిప॥ ౯౩॥
పంచభూతముల్ రవిశశి*బ్రహ్మవిష్ణు । శంకరుండు
న్వేదాదిశాస్త్రములును।బుట్టుటకుపూర్వ మున్న
దే * బట్టబయలు॥ అసిప॥ ౯౪॥
అదరుబెదరులులేకను * గదలకుండు । సురనర
తరుగిరిసచరా*చరములందు।బట్టబయలునై బ్రహ్మం
బు * పరగుచుండు॥ అసిప॥ ౯౫॥
చేతనంబన్న మాయయుఁ* జేరియుండు। మాయ
చైతన్యములరెంటి * మర్మమెఱుక । మాయగా

దోఁచెతుదకుదా* మాయమాయె॥అసిప॥ ౯౬॥

బయలుగగనంబనిజనులు* పలుకఁగలరు । శబ్ద
గుణకంబుగగనంబు*సత్యముగను । బట్టబయలందు
శబ్దంబు * పుట్టఁగలదె॥ అసిప॥ ౯౭॥

బయలుశూన్యమనిబలుక*పాటిగాదు । చూడ
బడినదిలేనిదే* శూన్యమరయ । యెంచుఁజూచినబ
యలుదా * నందెయుండు॥ అసిప॥ ౯౮॥

పలుకులున్నదానికి*ప్రాణముండు । ప్రాణము
న్నజననసం*ప్రాప్తియగును । పలుకుప్రాణంబులే
నిదే * బట్టబయలు॥ అసిప॥ ౯౯॥

ఎఱుకచేతనుజగమని*యెఱుఁగవలయు। యెఱు
కఁబోయిననన్నియు * యెగిరిపోవు । యెఱుక సహ
మూలగురుకృప * నెగరజిమ్ము॥అసిప॥ ౧౦౦॥

అంతరాంతరాంతరబాహ్య * లనెడుత్రిపుటి ।
తత్పదాసిపదముత్వంప*దంబులయ్యె । నట్టిత్రిపుటి
యుగాదుగా * యచలమనఁగ॥అసిప॥ ౧౦౧॥

విన్నదన్నదికన్నది * సున్నలాయె । గురుఁడులే
దాయెశిష్యుని*గుఱుతుబోయె । బట్టబయలాయెబయ
లనే * భ్రాంతితొలఁగె॥అసిప॥ ౧౦౨॥

తనువుగలవారికీబోధ * తరముగాదు । తనువు
గలవారికీబోధ * తగదుమఱియు । తనువులేనట్టివా
రికీ * తత్వబోధ॥ అసిప॥ ౧౦౩॥

అచలగురుగీతశతకంబు* ననుదినంబు । సద్గురు
వుచేతనిందులో * సారమెల్లఁ । దెలిసినంతనెనిజబ
యల్ * తేటపడును॥అసిప॥ ౧౦౪॥

అచలగురులైనశేషాచ * లార్యవరులు । రచనఁ
జేసినపరిపూర్ణ*యచలగ్రంథ । ములనుజూడ సంశ
యములు * దొలఁగిపోవు॥అసిప॥ ౧౦౫॥

శ్రీసుధాకరవంశంబు * చెలువుమీఱ । పోకలా
న్వయసంజ్ఞయుఁ * బొందుపడఁగ । చెలఁగు శేషా
చలాఖ్యన * శిష్యుఁడేను ॥అసిప॥ ౧౦౬॥

జగతియాదవగిరి పుణ్య * జన్మభూమి । తండ్రి

వేంకప్పరంగమాం * బంద్రుజనని । యచలభావ్రం
డభోజరా * జావ్వాయుండ ॥అసిప॥ ౧౦౭॥

శ్రీశోల్యేడాభోజరాజుచే * రచితమైన । అచల
గురుగీతశతకంబు * హంసశశియు । వెలుగునందా
కభువిలోన * వెలయుఁగాత ॥అసిప॥ ౧౦౮॥

# మంగళము.

మంగళము దేవగురువర్య * మాయరహిత ।
మంగళము దేవగురువర్య * మారవిజిత । మంగ
ళము దేవగురువర్య * మానివినుత॥ అసిప॥

ఇది, శ్రీమద్వేదాంతసార సచ్చిదానందరహిత నాదబిందు
కళాతీతుండును - అశరీరుండును అచలపరిపూర్ణుండును నైన స
పోకల - శేషాచలమునాయనివారికి శిష్యుండును సేవకుండును
నైన, సరస్వతి - భోజరాజుచే రచియింపంబడిన అలగురు
పరంపర ద్విపదయును - అచల గురురాయ శతకంబును,
సర్వంబును సంపూర్ణము.

